Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యుం I.] మద్రాసు : 1941 వ సం॥ మే నెల 9 వ తేది శుక్రవారం [నెం 8 రు

## ఈ వారంలో యుద్ధ వార్తలు.

### విమాన దాడులు.

మే నెల 1 వ తేదిన బ్రిటిషు యుద్ధ విమానాలు జర్మనీపై మరీ తీవ్రమగు దాడి జరిపినవి. ఆరోజు పగలు జర్మను జలాంతర్గాముల కేంద్రమగు డెన్‌హెల్డరు రేవుపైనను, నౌకా నిర్మాణ శాలలపైనను వేలకొలది బాంబులు వేయబడెను. అచటి సైనిక శిఖరముల మీద క్రింద బారుగా యెగురుచు మరఫిరంగి గుండ్లను వర్షించి సైన్యాలను చెల్లా చెదరు చేశాయి. రేవులోవున్న 5,000 టన్నుల నూనె నౌక యొకటి ధ్వంసమైనది. రాత్రి పూట ఫ్రాన్సు తీరమునందలి బ్రెస్టురేవుమీద బ్రిటిషు విమానాలు మరల భయంకరమగు దాడి జరిపాయి. శుక్రవారం 2 వ తేది రాత్రి, జర్మనీ ఈశాన్య భాగంలోవున్న హాంబర్గు, ఎండెన్ మొదలగు పారిశ్రామిక నగరాలను, నౌకా నిర్మాణ శాలలను తీవ్రంగా యెదిర్చి బాంబులు వర్షించి ధ్వంసం చేసివచ్చాయి. రాటర్‌డాం (హాలండు) నందు నూనె గిడ్డంగులపై వేసిన బాంబులవలన బ్రహ్మాండమగు మంటలు లేచాయి. డచ్చితీరములో 5,000 టన్నుల సప్లై నౌక నౌకదానిని ముంచివేశాయి. మరియొక నౌకకు బాంబు దెబ్బలు తగిలి చాల శిథిలమైనది. 3 వ తేదీ సాయంత్రం బ్రిటిషు విమానాలు, ఫ్రాన్సు తీరపు రేవులమీద చురుకైన దాడి జరిపి కొలది సేపట్లో వేలకొలది బాంబులు వేశాయి. విమానాలు ఇంగ్లండుకు తిరిగివచ్చిన తరువాత, చాలసేపటివరకు పరాసు తీరాన్నుంచి బ్రహ్మాండమగు ప్రేలుడు శబ్దాలు ఇంగ్లీషు తీరానికి గూడా వినిపించాయి. ఆ రాత్రి, చాల విమానాలు, జర్మనీయందలి కలోను మొదలగు పట్నాలపైన బాంబులువేసి, ఉత్తరాన నార్వేనుండి, పరాసుతీరంవరకు గల రేవులను శిథిలంచేసి వచ్చాయి. అందులో బ్రెస్టు రేవులో విశ్రమించియున్న షార్న్‌హార్స్టు, గ్నీసెనూ అను జర్మను యుద్ధ నౌకలపైన ప్రత్యేకంగా మరీ తీవ్రమగు దాడి జరిపి, ఇనుప కవచాలను భేదించే క్రొత్తరకపు పెద్దబాంబులను వందలకొలదిగా అనేకులమీద వేశాయి. రేవునందలి నౌకానిలయ ప్రదేశమంతా పెద్ద అగ్నిజ్వాలగా చేయబడింది. 4 వ తేది రాత్రి, బ్రెస్టు రేవును వదలకుండ తిరిగి దాడి సాగించాయి. ఆ దాడిలో చాల బాంబులు, జర్మను యుద్ధ నౌకలపైన పడి, చాలమంటలు గలుగజేయగ బ్రిటిషు వైమానికులు స్వయముగ చూచిరి. నార్వే సముద్రంలో జర్మను యుద్ధ నౌకల తైనాతీతో వెళ్లుచున్న శత్రు నౌకల జట్టులో 3,000 టన్నుల సప్లై నౌక యొకటి, బ్రిటిషు విమానపు బాంబులచే ముంచివేయబడింది. రాటర్‌డాం, ఆంట్వర్పు, లెహావ్రె పట్నాలమీద గూడ విస్తారమైన దాడి జరిగింది. ఆ ప్రాంతములలోగల శత్రువిమానాశ్రయాలు బాంబులచే శిథిలం చేయబడ్డాయి.

5 వ తేది రాత్రి బ్రిటిషు విమానాలు జర్మనీలో పారిశ్రామిక పట్నాలు విశేషంగాగల రైను జిల్లాపైకి అందును ముఖ్యంగా మాన్‌హీంనగరం పైకి జని వేలకొలది బాంబులు వర్షించి భయంకరమైన దాడి సాగించినవి. నార్వేలో స్టావెంజరు మొదలగు శత్రువిమాన కేంద్రాలుకూడ ధ్వంసం చేయబడెను. 6 వ తేదిన జర్మనీ వాయవ్యభాగంలోని హాంబర్గునందలి ఫ్యాక్టరీలపైన, ఇతర పారిశ్రామిక ప్రదేశాల మీద చాల బ్రిటిషు విమానాలు, వేలకొలది బాంబులు వర్షించాయి. బ్రిటిషు విమానదాడులచే పరాసు ప్రజలలో భయం వ్యాపించుటచేత, కార్మికులను అచటకువచ్చి పనిచేయుటకు తగిన ఆకర్షణ కల్గించడానికిగాను, బ్రెస్టు రేవులో పనిచేయు కార్మికులకు నెలకు 300 ఫ్రాంకుల జీతం అదనంగా ఇస్తామని పరాసు ప్రభుత్వం ప్రకటించవలసివచ్చినది.

శత్రు విమానాలు మే 2 వ తేదిన బ్రిటిషు పశ్చిమ తీరాన మెర్సిసైడు ప్రాంతమునగల పట్నంమీద కొంతసేపు దాడి జరిపాయి. ఇతర పట్నాలలోగూడ కొలదిగా బాంబులు పడ్డాయి. శత్రు విమానాలలో 4 పడగొట్టబడ్డాయి. మెర్సిసైడు ప్రాంతపు పట్నాలలో జననష్టం, ఆస్తి నష్టం విస్తారంగానే వుండవచ్చునని అనుకుంటున్నారు. 3 వ తేది రాత్రి చాల రోజుల తరువాత తిరిగి, లండనులోగూడ విమాన దాడుల హెచ్చరికలు వినిపించాయి. కాని దాడిమాత్రం క్రిందటి రాత్రిలాగే మెర్సిసైడు ప్రాంతపు పట్నాలమీద చాల తీవ్రంగా సాగింది. వెనుకటిలాగ కాక శత్రువు లీదాడిలో పెద్ద ప్రేలుడు బాంబులను విశేషంగా వుపయోగించారు. లివర్పూలులో ప్రజలు నివసించే ప్రదేశాలలో వేలకొలది చిచ్చుబాంబులు పడ్డాయి. కాని వానిని వెంటనే ఆర్పివేశారు. విమాన ధ్వంసక ఫిరంగులు, శత్రు విమానాలలో నాల్గింటిని పడగొట్టాయి. శనివారం రాత్రి ప్రారంభమైన దాడులు, ఆదివారం ఉదయంవరకు సాగుతూనేవున్నాయి. శిథిలాలను వెంటనే తీసివేయించి మనుష్యులను వెలుపలకు తీయడానికి చురుకైన యేర్పాటులు చేయబడ్డాయి. శనివారం రాత్రి దాడిలో 16 శత్రు విమానాలు పడగొట్టబడ్డాయి. ఆదివారం పగలుగూడ విమానాలు బ్రిటనుపైకి వచ్చాయిగాని, యెచ్చటా బాంబులు వేయలేదు. ఆదివారం రాత్రి బ్రిటనుపైన, అందు ముఖ్యంగా లివర్పూలు, మెర్సిసైడు ప్రాంతమునందలి ఇతర పట్నాలపైన, ఉత్తర ఐర్లండుపైనను గూడ, చాల తీవ్రమగు శత్రు విమానదాడులే జరిగాయి. లివర్పూలుపై దాడి, వెనుకటి రాత్రియంత తీవ్రమైనది గాదు. ఉత్తర ఐర్లండులో బెల్ఫాస్టు మొదలగు పట్నాలపైన జరిగిన దాడిలో ఆస్తి నష్టం విస్తారంగానే వున్నదని ప్రజలు, ఇండ్లు, ఫ్యాక్టరీలు, గిడ్డంగులు చాల నష్టమైనవని అధికారులు ప్రకటిస్తున్నారు. సోమవారం నాడు పగలుకూడ కొలది విమానాలు బ్రిటనుపై దాడి సాగించడానికి ప్రయత్నించాయి. వానిలో రెండు వెంటనే పడగొట్టబడ్డాయి.

6 వ తేదిన శత్రు విమానాలు, డోవరువద్ద నిర్మించబడిన "బెలూన్ ప్రాకారా" లను భేదించుకుపోవడానికి

ప్రయత్నించాయి. కాని క్రిందనుండి ఫిరంగి గుండ్ల దెబ్బల వలన వానిలో రెండు విమానాలు నేలకూలినవి. బ్రిటనులో పడమటి తీరమునగల మెర్సిసైడు, క్లైడు సైడు ప్రాంతాల లోని పట్నాలమీదను, ఉత్తర అయిర్లండుమీదను శత్రు విమానాలొక మాదిరిగా తీవ్రమైన దాడినే సాగించాయి. కాని మెర్సిసైడుపైదాడి క్రిందటి రోజంత తీవ్రంగా లేదు. నష్టములు చాల తక్కువ. క్లైడుసైడు ప్రాంతాలలో మాత్రం చాల జన నష్టం, ఆస్తి నష్టం, కలిగింది. సోమవారం రాత్రివరకు ఈనెలారంభంనుంచి అయిదు రోజులలో బ్రిటనుమీద 41 శత్రు విమానములు పడగొట్టబడెను. మంగళవారం రాత్రి క్లైడుసైడు ప్రాంతంమీద, ఇతర పట్టణాల మీద విస్తారంగానే శత్రు విమానాలు దాడులు సాగించాయి. కాని వీనిలో క్లైడుసైడుమీద దాడి చాల తీవ్రంగా జరిగింది. చాల జన నష్టం, ఆస్తి నష్టం కలిగి వుంటుందని అధికారులనుకుంటున్నారు. ఈ దాడిలో 8 శత్రు విమానాలు పడగొట్టబడ్డాయి.

ఏప్రిల్ నెలలో బ్రిటనుపై దాడులలో 163 శత్రు విమానాలు పడగొట్ట బడ్డాయి. వీనితో యుద్ధం ఆరంభంనుండి బ్రిటిషు దేశంమీద పడగొట్టబడిన శత్రు విమానాల సంఖ్య 3,327 వరకు హెచ్చింది.

## ఆఫ్రికా రంగం.

ఉత్తర ఆఫ్రికా (లిబియా) రంగంలో, టోబ్రుకు రేవు దుర్గం ఇంకా బ్రిటిషు సైన్యాల స్వాధీనంలోనేవుంది. శత్రులు ప్రతిదినం "టాంకుల" తోను, సకవచఆయుధ శకటములతోను, ఎదుర్చుచున్నారు గాని, బ్రిటిషు సైన్యాల నేమాత్రం కదిలించ గల్గుటలేదు. మే 1 వ తేదీన శత్రులు ఆక్రమించని వెలుపలి ప్రాకారాలుతప్ప, లోపలి ప్రాకారాలను, శత్రువు లేమాత్రం ఛేదింపగలుగలేదు. ఆదాడిలో శత్రులు 50 టాంకులవరకు కోల్పోయారు. ఈ వారంలో శత్రులు సాగించుచున్న దాడులను బ్రిటిషు సైన్యాలు తిరుగగొట్టి అపారమగు నష్టం కల్గించడమేకాక, 3,000-మంది శత్రుసైనికులను ఖైదీలుగాగూడ పట్టుకున్నారు. బ్రిటిషు విమానాలి రంగంలో, శత్రు శిబిరములమీదను, వారికి సప్లైలను కొని తెచ్చు మోటారు బండ్లమీదను దాడులు సల్పి, చీకాకుపరచుచున్నవి. టోబ్రూక్సువద్ద పోరాటంలో జర్మనులకంటె ఇటాలియను సైన్యాలెక్కువగా పాల్గొంటున్నాయి.

ఈజిప్టు సరిహద్దులయందు, శత్రుసైన్యాలు "సోలం" నుదాటి ఏమాత్రం ముందుకు సాగగల్గుటలేదు. ఆ ప్రాంతంలోవున్న బ్రిటిషు పటాలాలు శత్రుస్థానాలమీద కవియుచూ, చాల నష్టం కలిగిస్తున్నాయి. బ్రిటిషు అధికారులు లిబియా రంగమున క్రొత్త సైన్యాలను చేరుస్తున్నారు.

తూర్పు ఆఫ్రికా రంగమున శత్రు సైన్యాలు "అంబా అలగీ" అనే పర్వత దుర్గానికి మరలి అచ్చట నిలచి వున్నాయి. బ్రిటిషు సైన్యాలు వానిని వెంటాడుచున్నాయి. 2 వ తేదీన మన సైన్యాలు (తోవలో) బహిర్బాచ్, డిబబ్ అనే పట్నాలను ఆక్రమించాయి. శత్రువులు మరలిపోవుచు రోడ్లను వంతెనలను పాడుచేసి పోవటంవలన వానిని మరమ్మతులు చేసుకుంటూ ముందుకు సాగిపోవుటలో బ్రిటిషు సైన్యాలకు కొంచెం ఆలస్యమగుచున్నది. శనివారం రోజున డెస్సీకి 50 మైళ్ల దూరములోవున్న వాల్డియా అనే దుర్గం బ్రిటిషు స్వాధీనమైనది. టానాసరస్సునకు దక్షిణంగావున్న బహద్దర్ అనే దుర్గమునుకూడ, ఆ రోజునే బ్రిటిషు సైన్యాలు ఆక్రమించాయి. టానాసరస్సు నైలునది పుట్టినచోటు. ఆ ప్రాంతం బ్రిటిషువారాక్రమించుకోగల్గుటవలన, నైలునది ప్రాంతానికి శత్రు ఉపద్రవంతొలగింది.

టోబ్రుకు ప్రాంతంలో, భారతీయ సైన్యాలు మే 3 వ తేదీన ఎమడాని, ఉలేతర్డు అనే దుర్గాలను ఆక్రమించాయి. అచట, శత్రు సైనికులు చాలమంది ఖైదీలుగా చిక్కిరి. 6 వ తేదీన, మాజీ అబిసీనియా చక్రవర్తియగు హెయిల్ సెలాసీ, తిరిగి బ్రహ్మాండమగు ఉత్సవంతో తనరాజధానియగు ఆడిస్ అబాబాలో ప్రవేశించాడు.

మధ్యధరా సముద్రంలో బ్రిటిషు వారి మాల్టా దీవిపైన, ఈజిప్టు తీరంలోవున్న బ్రిటిషు నౌకా కేంద్రమగు అలెగ్జాండ్రియామీద, ఈ వారంలో శత్రువిమానాలు దాడులు సాగించాయి. గురువారంనాడు మాల్టాపైకి రెండుతరంగాలుగా వచ్చి చాల బాంబులువేశాయి. కాని అవి సైనిక నిర్మాణములకుగాని, రేవుకుగాని ఏమీ నష్టం కలిగించలేకపోయాయి. ప్రజల గృహములకు మాత్రం కొంచెం నష్టం కలిగింది. క్రిందనున్న ఫిరంగులు పైకి అగ్నిగోళములను భయంకరముగా విరజిమ్మటంచే, శత్రువిమానాలు యెక్కువ సాహసింప లేకపోయాయి. గురువారం రాత్రి అలెగ్జాండ్రియా పైకి శత్రువిమానాలు వచ్చాయిగాని బాంబులు వేయలేదు. 5 వ తేదీ రాత్రి శత్రువిమానాలు అలెగ్జాండ్రియా రేవుపైకి వచ్చి బాంబులు వేయడానికి ప్రయత్నించాయి. రేవులో వున్న బ్రిటిషు యుద్ధ నౌకలు, గ్రీకు నౌకలు భయంకరంగా గర్జిస్తు గంటసేపు ఆకాశమంతా అగ్నిగోళాలతో కప్పివేశాయి. శత్రుబాంబులవలన నష్టం ఏమీ కలుగలేదు. గ్రీకులు తమ ప్రభుత్వ స్థానముగ ఏర్పరచుకున్న క్రెటు ద్వీపంలోని మిత్రమండలి సైన్యాలకు న్యూజీలండు పటాలాల సేనానాయకుడగు మేజరు జనరలు ఫ్రేబర్గుగారిని ప్రధాన సేనానిగా నియమించారు. టర్కీకి సమీపంలో దక్షిణంగావున్న సైప్రెస్ దీవిలో బ్రిటిషు సైనికాధికారులు, శత్రుదాడుల నెదుర్కొనడానికి సన్నాహాలను త్వరితంగా పూర్తిచేస్తున్నారు.

## బాల్కనులు, టర్కీ, ఈరాక్, ఈరాన్.

యుగోస్లావియాలో వాయవ్య ప్రాంతాన్ని, తమ రాజ్యంలో కలుపుకుంటూ ఇటాలియను ప్రభుత్వం ప్రకటన గావించింది. ఈ ప్రాంతానికి జుబిల్జానా రాష్ట్రమని గూడ పేరు పెట్టింది. యుగోస్లావియా యుద్ధ విమానాలు బ్రిటిషు విమానదళంతో చేరి శత్రుల నెదిర్చి ఇంకను పోరాడుచున్నవి. చాల మంది యుగోస్లావు వైమానికులు గూడ తప్పించుకొని వచ్చి చేరుచున్నారు. యెక్కడెక్కడవున్న యుగోస్లావియా నౌకలుగూడ వెంటనే బ్రిటిషు రేవులకే రావలసినదని యుగోస్లావియా ప్రభుత్వమువారి కోరికపై, బ్రిటిషు ప్రభుత్వంవారుత్తరువుల నంద జేసిరి. క్రోషియాకు చెందిన ప్రాంతములను కొన్నిటిని ఇటలీ, హంగెరీలు ఆక్రమించుకొనుట క్రోషియా ప్రజలలో చాల అసంతృప్తిని కలిగించినది. పీటరు రాజునాయకత్వం క్రింద జెరూసలంలో నెలకొల్పబడిన యుగోస్లావియా ప్రభుత్వం అక్కడినుండి పోరాటము సాగించుటకు తన కృతనిశ్చయాన్ని ప్రకటించింది. యుగోస్లావియా స్వాతంత్ర్య ప్రతిపత్తిని అంగీకరించిన బ్రిటను, అమెరికా, రష్యా ప్రభుత్వాలయెడల విశ్వాసం ప్రకటించింది.

ఇరాక్‌లో గతమాసమున, రషీద్ ఆలీగారి నాయకత్వమున యేర్పడిన ప్రభుత్వమునకు బ్రిటిషు ప్రభుత్వమునకు వ్యవహారములుచెడి, యుద్ధములోనికి పరిణమించినది. ఈరాక్‌లో హబినియావద్దనున్న బ్రిటిషు విమానదళకేంద్రము సమీపము నుండి ఇరాకు సైన్యములను ఫిరంగులను తొలగింప

వలసినదని బ్రిటిషు అధికారులు కోరిరి. ఈరాకు ప్రభుత్వం అందుకు నిరాకరించడమేగాక, అచటికి మరికొన్ని సైన్యాలను పంపింది 2 వ తేదిన ఇరాకు శతఘ్నిదళం, హబినియా లోని బ్రిటిషు విమాన నిలయంమీద ఫిరంగిగుండ్లు వర్షించడం ప్రారంభించింది. అంతట ఉభయపక్షములకు పోరాటం సాగింది. రషీదు ఆలీగారి ప్రభుత్వాన్ని కూలద్రోసి, న్యాయబద్ధమైన ప్రభుత్వాన్ని నెలకొల్పవలసిదని బ్రిటిషు బ్రాడ్ కాస్టింగు స్టేషనువారు ఇరాకు ప్రజలకు విజ్ఞప్తిచేశారు. రషీదు ఆలీ ప్రభుత్వం, తనకు సహాయంచేయవలసినదని జర్మనీతో రాయబారాలు జరుపుచున్నట్లు బయల్పడింది. ఇరాకీ సైన్యాలు, మోసలు దగ్గిరనున్న బ్రిటిషువారి నూనెగనుల ప్రాంతమును జలప్రవాహముతో ముంచి ధ్వంసంచేయుటకు ప్రారంభించిరని టర్కీనుండి వచ్చినవార్తలు దెలిపెను. బ్రిటిషు విమానాలు 3 వ తేదిన ఇరాకు విమానదళాన్ని తీవ్రంగా యెదిర్చి సగభాగమును ధ్వంసమొనర్చెను. బ్రిటిషు సైన్యములు, బాస్రాయందున్న ఇరాకు సైన్యముల నెదిర్చి పూర్తిగ వెడలగొట్టెను 4 వ తేదీన జరిగిన పోరాటంలో హబినియావద్ద శత్రుశతఘ్నిదళం శిథిలంచేయబడింది. ఇరాకు విమానదళంలో 80 ప్రాత విమానాలు మాత్రంవున్నాయి. వానిలో అత్యధికభాగం బ్రిటిషు విమానాలచే ధ్వంసమొనర్పబడెను. బాగ్దాదుకు సమీపంలోవున్న శత్రుసైనిక నిలయంమీద గూడ బ్రిటిషు విమానాలు చాల టన్నుల బరువుగల బాంబుల వర్షించినవి. 5 వ తేదిన బాస్రా ప్రాంతంలో ప్రశాంతంగానేవుండెను. బాగ్దాదువద్దమాత్రం పోరాటం సాగుచుండెను. 6 వ తేదిన కూడ పోరాటం కొంత తగ్గినది. మందుగుండు సప్లైలు లేక పోవటంవలన, తక్కువగా వాడవలసినదిగా ఇరాకు అధికారులు సైనికుల కుత్తరువులు చేసినట్లు బర్లినువార్త తెలుపుచున్నది. బ్రిటిషు సైన్యాలు హబినియా ప్రాంతమునుండి ఇరాకు సైన్యాలను వెడలగొట్టినవి. మూసలునుండి హైపాకు నూనెను తెచ్చు గొట్టములుగల ప్రాంతమునందున్న రుల్బా అను పట్టణమును బ్రిటిషు సైన్యాలు తిరిగి ఆక్రమించుకున్నాయి.

ఇరాకులోనీ పోరాటం సంభవించినందుకు టర్కీ అధికారులు, ఈజిప్టు అధికారులు చాల చింతించిరి. టర్కీ ప్రభుత్వం ముందు జాగ్రత్తకోసం, టర్కీ-ఇరాకు సరిహద్దులకు సైన్యాలను, విమానాలను నడపి బందోబస్తు యేర్పాటులు గావించుకున్నది. ఈరాక్ సరిహద్దులలోగూడ టర్కీ- సైన్యాలు ఇటులనే బందోబస్తు చేసుకుంటున్నాయి. వారము దినములుగా పశ్చిమ సరిహద్దు దుర్గాలను పరీక్షిస్తున్న టర్కీ అధ్యక్షుడు ఇనేనూగారు 2 వ తేదిన ఇస్టాన్‌బుల్ నగరం చేరినట్లు ప్రకటింపబడింది.

ఇరాక్ ప్రభుత్వం, రష్యావైపు సరిహద్దులలో తన సైన్యాలను కేంద్రీకరించుచున్నదనువార్త అసత్యమనీ, రష్యా-ఈరాక్ సంబంధాలు వెనుకటివలె సౌమ్యంగానే వున్నాయిగాని మారలేదనీ, టర్కీలోని అంకారా రాయబారి ప్రకటించాడు.

## విషీ.

ఫ్రాన్సును తన వైపునకు త్రిప్పుకొని తనతో కలసి పనిచేయునట్లు చేయడానికి జర్మనీ సకల విధాలా ప్రయత్నిస్తున్నది. ఎన్నియో ఆకర్షణలు కల్పిస్తున్నది. విషీ ప్రభుత్వపు ఉప ప్రధానియగు డార్లన్‌గారు, జర్మను కోర్కెలను తెలిసికొనడానికి పారిస్ నగరమునకు వెళ్ళి 4 వ తేదిన విషీకి తిరిగివచ్చి, తాను కనుగొనివచ్చిన విషయములను పెటెయిన్ సేనానికి నివేదించాడు. జర్మనీ-ఇటలీ-ఫ్రాన్సులు తమకు కల మోటారుబండ్ల నిర్మాణ సౌకర్యముల నన్నిటినీ కలిపి పరస్పర సహకారంతో నిర్మాణం సాగించుకొనుటకు ఒక పెద్ద సంఘమును నెలకొల్పుకొనినట్లు ప్రకటించారు. ఈ యొడంబడికపైన బర్లినులో సంతకాలు జరిగినవి. ఈ సంఘం త్వరలోనే సమావేశమవును. ఫ్రాన్సు జర్మనీతో కలసి పనిచేయుచున్నదనుటకు ఇదియొక నిదర్శనం. జర్మనీతో రాజకీయ ఒడంబడికలు చేసుకోడానికికూడా, డార్లన్‌గారు రాయబారాలు సాగిస్తున్నట్లు స్విట్జర్లండు వార్తా సంఘం తెలుపుతున్నది. మొరాకోలోని నౌకా, విమాన నిలయాలను తమకు స్వాధీనం చేయవలసినదని జర్మనులు విషీ ప్రభుత్వాన్ని వత్తిడి చేస్తున్నట్లు అమెరికను పత్రికా విలేఖరులు తెలుపుచున్నారు. జర్మనీతో యెంత వరకు సహకారం సలుపదగునను విషయమై డార్లన్ గారికి ప్రభుత్వాధ్యక్షుడగు పెటెయిన్ సేనానికి విభేదము లధికమైనటులుగూడ ఆ విలేఖరులు ప్రకటించుచున్నారు.

జర్మనీ-ఫ్రాన్సులు గత వత్సరం చేసుకున్న యుద్ధ విరామపు ఒడంబడిక షరతులను సడలించుటకుగాను డార్లన్‌గారు పారిస్‌లో జర్మను ప్రతినిధియగు అబెట్జుగారితో క్రొత్తగా ఒక ఒడంబడికను చేసుకున్నట్లు 7 వ తేదిన విషీలో ప్రకటించిరి. దీనివలన ఫ్రాన్సులోనున్న జర్మను సైన్యాలకొరకు విషీ ప్రభుత్వం రోజు 1 కి 40 కోట్ల ఫ్రాంకుల చొప్పున చెల్లించవలసిన మొత్తం 30 కోట్లకు తగ్గింపబడింది. ఆక్రమిత అనాక్రమిత ప్రాంతాల సరిహద్దులనుకూడా సవరించుకున్నారు.

తూర్పు ఆఫ్రికాలోని పరాసు సోమలీ ల్యాండును బ్రిటిషు సైన్యాలు ఆక్రమించుటకు ప్రయత్నించుచున్నవని విషీనుండి బయలుదేరిన వార్త పూర్తిగ నిరాధారమైనదనియు, ఆ ప్రాంతములలోనున్న బ్రిటిషు సైన్యాలకు ఆక్రమణోద్దేశం లేదనియు, శత్రు దేశము నాక్రమించుటకు మాత్రమే అవి అచటనున్నవనియు బ్రిటిషు అధికారులు ప్రకటించిరి.

అమెరికానుండి ఫ్రాన్సుకు ఆహారపదార్థముల దెచ్చిన రెండు నౌకలు మార్సెయిల్సు రేవును చేరినవి.

## తటస్థ దేశాలు : స్పెయిను, పోర్చుగలు.

స్పెయిను దేశమునుగూడ తమ వైపున యుద్ధములోనికి దింపి, బ్రిటీషువారి జిబ్రాల్టరు రేవు దుర్గమును ఆక్రమించుకొనునట్లు చేయుటకు, హిట్లరు స్పెయినుపై సకలవిధములగు వత్తిడులను ఉపయోగిస్తున్నాడనీ, తొందరచేస్తున్నాడనీ, జిబ్రాల్టరుకు గవర్నరుగనుండి యిపుడు విరమించుకొనుచున్న లెఫ్టనెంటు జనరలు సర్ క్లైవు లిడ్డెలుగారు 2 వ తేదిన రేడియోలో ప్రసంగిస్తూ ప్రకటించిరి. యెవరొత్తివచ్చినా జిబ్రాల్టరును కదల్పలేరనియు, అది శత్రు దుర్భేద్యముగ నొనర్పబడినదనియు అతడు వెలడించాడు. స్పెయిను యుద్ధానికి దిగకపోతే, స్పెయిను దేశంలోనుండి జిబ్రాల్టరుకు జర్మనులకు త్రోవైనా యివ్వవలసినదని అడుగుచున్నారనీ, అందుకుగాను ఇప్పటికే జర్మనీ స్పెయినులో మారు వేషాలతో 25,000 సైనికులను చేర్చియుంచిందనీ లండను టైమ్సు విలేఖరి పోర్చుగలునుండి వ్రాస్తున్నాడు.

స్పెయిను అక్సిసు ఒడంబడికపై సంతకంపెట్టి, బహిరంగముగా యుద్ధంలో దిగునని పలువదంతులు వ్యాపించియున్నవి. అవి నిరాధారమైనవని స్పెయిను విదేశాంగ మంత్రియగు సెనరు సూనరుగారు ప్రకటించారు. జర్మనులు పోర్చుగలు దేశము పైకిగూడ దాడివెడలి ఆక్రమింపనున్నారని వదంతులు వ్యాపించియున్నవి. అట్లాంటికు సముద్రంలో త్రోవ

లోవున్న అజోర్సు దీవులను ఆక్రమించుటకు జర్మను లుద్దేశించుచుండిరను వదంతులవలన పోర్చుగలు ప్రభుత్వంవారు అజోర్సు దీవుల రక్షణార్థం 3 వేల సైన్యమును పంపిరి.

## రష్యా.

మే 1 వ తేదిన రష్యాలో, పెద్ద సైనికవ్యూహ ప్రదర్శనం జరిగింది. సోవియటు రష్యా అధ్యక్షుడగు స్టాలిన్ మొదలగు ప్రముఖులు స్వయంగా హాజరై వీనిని వీక్షించిరి. సోవియటు సైన్యాలు అజేయములనీ శత్రు విమానాలేవ్వీ, రష్యా పట్నాలపై దాడి సాగించజాలవనీ, ఈ ప్రదర్శనముల వలన రుజువైనదని "ప్రవాదా" అనే రష్యను పత్రిక వ్రాసింది. సోవియటు సైనిక కలాశాల పట్టభద్రుల సమావేశంలో స్టాలిను 5 వ తేదిన ప్రసంగిస్తూ ఆధునిక పద్ధతుల ననుసరించి రష్యను సైన్యాలు పునర్నిర్మాణ మొనర్చబడెననీ, నూతన ఆయుధ పరికరము లెన్నియో సమకూర్చబడెననీ ప్రకటించాడు.

సోవియటు-జర్మను ఒడంబడిక ప్రకారం జర్మనీ కొసగవలసిన వస్తువులను రష్యా సప్లైచేయుటలేదనియు, ఈ విషయమై జర్మను-సోవియటు రష్యాకు మూడు షరతులను అందచేయదలచిరనీ, వానివలన వుభయదేశాలకు సంగ్రామము తప్పదనీ, లండను టైమ్సు పత్రికకు టర్కీయందలి విలేఖరి దెలిపెను.

స్టాలిన్ 6 వ తేదిన సోవియటు ప్రభుత్వ ప్రధాన మంత్రిపదవినికూడ తానే తీసుకున్నాడు. ఇంతవరకు ప్రధాన మంత్రిగను, విదేశాంగ మంత్రిగనుగూడ పనిచేయుచున్న మాలటావ్‌గారు యికమీద, విదేశాంగ మంత్రిగనే వ్యవహరించుచుందురు. దీనివలన స్టాలిన్ పలుకుబడి నిత్య వ్యవహారాలలో చాలా హెచ్చుతుంది.

## అమెరికా - అట్లాంటిక్.

అమెరికా సంయుక్తరాష్ట్రాలు ప్రస్తుత తటస్థ విధానాన్ని వదలివేసి బ్రిటను తరఫున ప్రత్యక్షంగా యుద్ధములో దిగుటకు నిశ్చయించుకొనవలెనని, "బాల్టిమోర్ సన్" అనే అమెరికను పత్రిక బహిరంగంగా వ్రాసింది. అమెరికాలోని ప్రతి యంత్రశాలలనుగూడ ఆయుధ, నౌకా, విమాన నిర్మాణాలకోసం వుపయోగించుటకు యేర్పాటు లొనర్పవలసినదని, రూజ్వెల్టు అధ్యక్షుడు అధికారులను హెచ్చరించాడు. ఇందుకుగాను, వేసంగి సెలవులు వదలుకోవలసినదని అధికారులు కార్మికులకు విజ్ఞప్తిచేశారు. బ్రిటనే, ఈ మహా సంగ్రామంలో తుదకు విజయమంది తీరునని, అమెరికాలోగల 14 మంది సుప్రసిద్ధ సేనానులు సనిదర్శనంగా నిరూపిస్తూ పత్రికల కొక ప్రకటనగావించారు. మంగళవారంనాడు సెనెటరు ఎం. డి. పెప్పరుగారు సెనెటులో మాట్లాడుతూ యునైటెడు స్టేట్సు యుద్ధంలో దిగవలెనని హెచ్చరించారు. శాసన సభలో విదేశాంగ సంఘాధ్యక్షుడు, సరకులను బ్రిటనుకు పంపుటకు అమెరికా యుద్ధ నౌకలను తైనాతీ యొసగవలెనెను.

అమెరికానుండి ఆయుధ సామగ్రుల తెచ్చుచున్న 26 నౌకలు 2 వ తేదికి సూయజు రేవువద్దకు వచ్చిచేరాయి. ఆ సరకులు అసలు గ్రీకు యుగోసావియాల కుద్దేశింపబడినవి. వాని నిపుడు సూయజువద్ద బ్రిటిషు సైన్యాలకు బటువాడాచేస్తున్నారు. మార్చి నెలలో అమెరికావారు బ్రిటిషు సామ్రాజ్యదేశాలకు 414 విమానాలను పంపించారు. ఫిబవరిలో అందచేసినవి 258 మాత్రమే. విమానాల నిర్మాణం త్వరితంగా హెచ్చించుటకోసం, రూజ్వెల్టుగారు 6 వ తేదిన తన మంత్రివర్గాన్ని సైనిక నౌకా శాఖాధికారులను సమావేశపరచి సంప్రదించిరి.

అమెరికా సంయుక్త రాష్ట్రముల యుద్ధాంగ కార్యదర్శియగు స్టిమ్సన్‌గారు 6 వ తేదీ రాత్రి రేడియోద్వారా ఉపన్యసిస్తూ, అక్షరాజ్యాల విజయం అమెరికాకు చాల ప్రమాదకరమనీ అందుచే అవసరమైతే యుద్ధానికి దిగికూడా, బ్రిటనుకు సహాయంచేయాలనీ, అమెరికా ప్రజలను గట్టిగా హెచ్చరించాడు.

న్యూయార్కులో దిగబడిపోయిన షుమారు 100 మంది జర్మను నావికులను, అమెరికా అధికారులు 7 వ తేదిన అరెస్టుచేశారు వీరినందరిని ప్రవాసమునందుంచెదరని అనుకుంటున్నారు.

## దూరప్రాచ్యం.

ఈ నెల 6 వ తేదిన జపాను రాజధానియగు టోకియోలో, జపాను—ఇండోచైనా దేశాలు ఒక వర్తక ఒడంబడిక చేసుకున్నాయి. ఇండో చైనాఎగుమతి దిగుమతుల విషయంలో తక్కువ సుంకముల విధించి జపాను యెడల అత్యంతాభిమానమును కన్పరచుటకును, ఇండోచైనాలో వ్యవసాయం పరిశ్రమలు మొదలగువానిలో జపాను పెట్టుబడులకు సంపూర్ణమగు అవకాశ మొసగుటకును ఇండోచైనా ప్రభుత్వం అంగీకరించింది. ఇండోచైనా దిగుమతులలో ప్రధానమైన వానికి సుంకముల విషయంలో సౌకర్యము లొసగుటకు జపాను అంగీకరించింది.

చైనాలో మరికొన్ని ప్రదేశాలలో జపానీయులు సైన్యాలను దింపి ఆక్రమించుచున్నారు. హొనాపేరాష్ట్రంలో శాంతిని కాపాడే కార్యమును జపానీయులచే తయారు చేయబడిన చైనా సైన్యాలకు అప్పగించి, జపానీయులు అచటనున్న తమ సైన్యాలను దక్షిణ ప్రాంతాలకు మార్చుకున్నారు. ఇపుడు చైనాలో 10 లక్షల జపాను సైన్యంవుంది. అది 6 భాగాలుగా విభజింపబడి, పీపింగ్, టయాన్, షాంటుంగు షాంగుహే, కాంటను ప్రాంతాలలోనుండి వేర్వేరుగ చైనాపై యుద్ధం సాగిస్తున్నది. చెకియాంగ్ రాష్ట్రంలో వించో, హైమాన్ అనే రేవులను, చైనా సైన్యాలు తిరిగి ఆక్రమించుకొని జపాను సైన్యాలను పారద్రోలినవి. జపాను సైన్యాలు 6 వ తేది వుదయం హూపే రాష్ట్రంలో 80 వేల చైనా సైన్యాలను చుట్టుముట్టెననీ, ఉభయపక్షాలకు తీవ్రమైన పోరాటం జరుగుచున్నదనీ, హొనాన్ రాష్ట్రంలో జపాను సైన్యాలు చాలముందుకు చొచ్చుకొని పోయెననీ జపానీయ అధికారులు ప్రకటించారు. 3 వ తేదిన 80 జపాను విమానాలు ప్రస్తుతం చైనా రాజధానియగు చుంకింగుపై తీవ్రమగు దాడి సాగించాయి.

దూరప్రాచ్యంలో వ్యవహార పరిస్థితులు చాల విషమముగనే యున్నవనీ శత్రువులు యెదిర్చినయెడల తాము ప్రతిఘటించి పోరాడి తీరెదమనీ, తూర్పు ఇండియా దీవులలో డచ్చి విదేశాంగ మంత్రియగు వాన్‌క్లెఫెన్సుగారు ప్రకటించారు.

## ఆక్రమిత ప్రాంతాలు.

బెల్జియమునందలి లీజ్ పట్టణమున జర్మను సైన్యాలు బసచేసియున్న ఇంటి గోడలమీదగాని ప్రాకారాలమీదగాని ఎవరైనా ఏదైనా వ్రాయుచున్నట్లుంటే వారు స్త్రీలైనా పిల్లలైనా సరే వెంటనే తుపాకితో ప్రేల్చివేయవలెనని జర్మను అధికారులు కాపలా సైనికులకు ఉత్తరువు చేశారు. గోడల మీద జర్మనులకు ప్రతికూలమైన మాటలు బ్రిటిషువారికి అనుకూలమైన మాటలు ప్రజలలో కొందరు వ్రాస్తుండటంవలన ఇట్టి ఉత్తరువులు గావింపబడెనని "బెల్జియం స్వతంత్ర వార్తా సంఘం" తెలుపుచున్నది. బ్రిటిషు సైనికులను జర్మనులకు అప్పగింపకుండ దాచినందుకు బెల్జియంలో 13 మందికి యెనిమిదేసి సంవత్సరాల కఠినశిక్ష విధించబడెను.

హెచ్.ఎం.ఎస్ "ఆర్క్-రాయల్" అను ఇంగ్లీషువారి యుద్ధపు ఓడ.



ఇది బాగుగా తిరుగుడు పనిచేయుచునే ఉన్నది. దీనిని అనేకసార్లు ముంచివేసినట్లు శత్రువులు ప్రచారం చేశారు.

దీనిపొడవు 685 అడుగులు, నావికులు 1,575 గురు, వడి 30·75 నాట్లు. దీనిమీద 4.5 అంగుళముల 16 ఫిరంగులున్నవి, అగ్నిప్రమాదముల నార్పగల సాధనములున్నవి. రాత్రిపూట నడచుటకు చక్కని దీపములు నైపుణ్యముగా అమర్చబడియున్నవి.

# జిబ్రాల్టరు కొండ.

## దీనిపై హిట్లరు తల పగులవలసిందేగాని గెలవజాలడు.

మధ్యధరాసముద్రమునకు పడమటి ద్వారముగనున్నట్టిన్ని, జిబ్రాల్టరు జలసంధికి ఉత్తరమునవున్నట్టిన్ని, జిబ్రాల్టరునగరము ఒక కొండ ప్రక్కన కట్టబడియున్నది. జిబ్రాల్టరు కొండ చాల ఎత్తై దక్షిణమునుండిగాని, పడమరనుండిగాని ఎక్కుటకు వీలుగానుండదు. అచటి నౌకాశ్రయరక్షణకు యిది పెట్టని గోడగా ఉపయోగపడుచున్నది. గత యిరోపా మహా యుద్ధంలో స్టీమరులు బొగ్గు నింపుకొను కేంద్రంగా చాల ఉపయోగపడినది. ఇప్పుడు యీ యుద్ధంలో బ్రిటిషువారి నౌకాదళకేంద్రముగను, మధ్యధరా సముద్రానికి పశ్చిమ ద్వారంగను, ఇండియాకు ఇంగ్లాండునుండిగల రెండు స్టీమరుదారులకు కూడలిస్థలంగను, ప్రాధాన్యత వహిస్తున్నది.

చర్చిలుగారు చెప్పినట్లు హిట్లరు నడుదుట రాసియున్న ఓటమి సిద్ధించేవరకు ఎంత అల్లరి సమయాలలో అంతా చేయ దలచుకున్నాడు. అమెరికానుండి వస్తున్న ఆయుధ సహాయంవల్ల బ్రిటిషువారి శక్తి అమితంగా హెచ్చి హిట్లరు ఆశలను అడుగంటించేస్తుంది. అది జరిగేలోగా బ్రిటిషువారి నౌకాశక్తి ఛేదించడానికి అతడు ప్రయత్నించును. ఆ యుద్దేశంతోనే అతడు ఈజిప్టు సూయజు కాలువలమీదకు పోయేసరికి బ్రిటిషు సైనిక-సైన్యం నలిందవర్గ ఆటను నిలిపివేసెను. అదే ఉద్దేశంతో అతడు జిబ్రాల్టరుమీదకు తన సైన్యాలు పోవడానికి దోవ ఇమ్మని స్పెయినును ప్రభుత్వానికి ఒత్తిడి కలుగజేస్తున్నాడు. స్పెయినులో కొందరు అతి నాజీ అభిమాన నాయకులున్నారు. విదేశాంగ మంత్రి సీనర్ శెరానో సూనర్‌గారు వీరిలో పెద్ద. జర్మనీతోకలసి ఇంగ్లాండును ఓడిస్తే తిరిగి పూర్వపు స్పెయిన్ సామ్రాజ్యాన్ని స్థాపించవచ్చునని వీరికి ఆశలు కలిపించుటకు హిట్లరు తన అనుచరుడగు గోడ్ల్ఫ్ హెస్సుగారిని స్పెయిన్‌కి పంపించారు. ఈ యత్నాలు ఎంతవరకు ఫలిస్తాయో చూడవలసియుంది. స్పెయినుకి తినుబండారములు, మందులు ఇంగ్లాండు-అమెరికాలు పంపుతున్నాయి. ఈ సహాయం ఒదులుకొని తన ప్రజలను తిరిగి యుద్ధ కష్టాలలోనికి స్పెయిను అధ్యక్షుడగు జనరలు ఫ్రాంకో దింపుతాడా? ఇప్పటివరకు జిబ్రాల్టరును తిరిగి స్పెయినులోకి తీసుకోవాలని ఆందోళన చేస్తున్న అతివాదులను అణచి ఉంచగలిగేడు, ఫ్రాంకో.

### బ్రిటిషువారి రక్షణ ఏర్పాట్లు.

ఎట్నించి ఎటువస్తుందో అని బ్రిటిషు అధికారులు తగు రక్షణ ఏర్పాట్లు చేస్తున్నారు. అనుభవశాలిఅగు గోర్టు ప్రభువుని జిబ్రాల్టరు గవర్నరుగను, సేనాధిపతిగను నియమించారు. సివిల్ ప్రజలను అక్కడినుంచి పంపివేశారు. ఇక ఆ కొండను ఎటునుంచి శత్రువులుదాడివచ్చినా నిల్చిపోవుటకు తగుకట్టుదిట్టాలు చేశారు. క్రొత్త సైన్యాల్ని యుద్ధనౌకలలో తెప్పించేరు. వెడలిపోతున్న పాత గవర్నరు సర్ క్లైవు లిడెల్‌గారు, కొండమధ్యలో గుహవలె కట్టబడియున్న కేంద్రస్థానమునుండి రేడియో ఉపన్యాసం ఇట్లా చేశారు. "ఈ కొండను ఇంకెవరు కట్టలేరు. కావలిస్తే హిట్లరు తన సైన్యాలను పంపిచూడవచ్చు. జిబ్రాల్టరుపై దాడిచేసి జలసంధిని

మూసివేయడానికే స్పెయిన్ను ఈయుద్ధంలోకి దింపాలని హిట్లరు అనేకసార్లు ప్రయత్నించేడు. స్పెయిన్ ప్రజలలో నూటికి తొంభైమందికి ఈ యుద్ధంలో చేరడం యిష్టంలేదు. అయినా ప్రతిదేశంలో వలెనే ఇక్కడకూడా, తన ప్రచారం వలన కొందరిని తనకి అనుకూలంగా త్రిప్పుకోగలిగెను. కావుననే జిబ్రాల్టరు రక్షణకు ఇంత తొందరగా ఏర్పాట్లు జరిగేయి. "సముద్రంలోంచిగాని ఆకాశంమీంచిగాని, నేలపై నుండిగాని ఏవైపునుండి శత్రు సైన్యాలు వచ్చినా తరిమేయడానికి సిద్ధంగా ఉన్నాము."

## జిబ్రాల్టరు చరిత్ర.

పూర్వకాలం గ్రీకు-రోమక్ సామ్రాజ్యములు వెలసియున్నప్పుడు ఈ జిబ్రాల్టరు కొండను కాల్పే లేదా ఎలిబి అని పిలిచేవారు. ఎదురుగా ఆఫ్రికా తీరమునందున్న కొంటా కొండను ఎబిలా అని పిలిచెడివారు. అప్పటి నావికులు ఈ రెండు కొండలవరకు వచ్చుట మహాసాహసకార్యంగా ఎంచెడివారు. "హెర్క్యులిస్ స్థంభాలు" అని యివి ప్రసిద్ధి గాంచినవి. ఎనిమిదో శతాబ్దమునందు అరబ్బుల నాయకుడు కాల్పె కొండపై ఒక దుర్గము కట్టెను. దానిని 1309 లో స్పెయిన్ వశపరచుకొనెను. 30 ఏండ్లలో తిరిగి అరబ్బులు దానిని తీసుకొనిరి. 1469 లో తిరిగి ఇది స్పెయిన్ రాజులకు వశమైనది. 1502 లో స్పెయిన్ రాజు జిబ్రాల్టరు ప్రాముఖ్యతను గమనించి రక్షణ ఏర్పాట్లను దిట్టము చేసెను.

1704 వ సంవత్సరములో స్పెయిన్లో యుద్ధం జరిగింది. అపుడు బ్రిటిషు-డచ్చి మిత్రమండలి సైనికులు మూడు రోజులు ముట్టడిచేసి జిబ్రాల్టరు దుర్గమును వశపరచుకొనిరి. ఆ యుద్ధం ఆస్ట్రియా రాకుమారుని కొరకు జరిగినప్పటికీ, బ్రిటిషు సేనాధిపతి జిబ్రాల్టరును వశపరచుకొని బ్రిటిషు రాణిగారికి ఒప్పగించెను. తరువాత కొద్ది నెలలలోనే స్పెయిను-ఫ్రాంసు సైన్యాలు జిబ్రాల్టరును తీసుకోవలెనని దండెత్తి వచ్చేయి కాని గెలువలేకపోయేయి. అటుపిమ్మట ఇరవై ఏండ్లవరకు జిబ్రాల్టరును తనకిమ్మని స్పెయిన్ రాయబారాలు నడిపింది. 1726 లో ఇంకోసారి ముట్టడిచేసి విఫలమైంది.

## నాలుగేళ్ల ముట్టడి.

1779 వ సంవత్సరములో స్పెయిను మరొకసారి జిబ్రాల్టరు ముట్టడి పట్టుదలతో ప్రారంభించింది. ఈ ముట్టడి నాలుగేండ్లు కొనసాగింది. స్పెయిన్ స్టీమర్లు సముద్రమార్గం బంధించి దుర్గంపై ఫిరంగులు పేల్చుచు, లోపల ప్రజలను తిరుగుబాటునకు ప్రోత్సహిస్తు, అనేకవిధాల ప్రయత్నం చేసినా లాభంలేకపోయింది. బ్రిటిషు నౌకాదళాధిపతి సర్ జార్జి రోడ్నీ గారు కావలాయున్న శత్రునావలను చేదించుకొని రేవులో ప్రవేశించి ముట్టడిచేయబడిన బ్రిటిషు సైన్యాలకు ఆహారపదార్థములు మందుగుండు సామానులు సరఫరా చేసెను. బ్రిటిషు ఇంజనీర్లు కొండను దొలిచి బయటకు అగుపడని గుహాలుకట్టి, తుపాకులు పేల్చుటకు రంధ్రాలు దొలిచిరి. అవి ఇప్పటికి ఉన్నాయి. హౌ ప్రభువు గారు వేరొక నౌకాయుద్ధమునందు విజయము గాంచెను. దానితో 1779 లో మొదలైన ముట్టడి 1783 లో ముగిసెను. ఓడిపోయిన స్పెయిను సేనాధిపతి దుర్గములోనికి పోయి బ్రిటిషు గవర్నరుకి మర్యాద జరిపెను.

నాటినుండి జిబ్రాల్టరు చరిత్రలో ఎట్టి చిక్కులు లేవు. ఇప్పుడు జిబ్రాల్టరు కొండను చాలా శక్తివంతమగు బ్రిటిషు ఫిరంగులు కాపాడుచున్నవి. రెండు మైళ్లవరకు కొండలోనే దొలిచి పండ్రెండు గజములకు ఒకటిచొప్పున ఫిరంగి రంధ్రాలు ఏర్పాటుచేయబడినవి. కొండపైన వర్షపునీరు కావలసినంత శేకరించి దిగువ టాంకులలోకి పంపే ఏర్పాటుగలదు. బ్రిటిషు నౌకాదళం దానిని సర్వదా కాపాడుచుండును. "జిబ్రాల్టర్" అంటే భద్రతకు మారుపేరుగా వాడబడుచున్నది. హిట్లరు దానిపై ప్రత్యక్షంగా దాడిసలిపే అవకాశంలేదు. కాని సియోటానుండి లేక స్పెయినులో ఇతర నగరాలనుండి విమానాలను పంపి బాంబులు వేయవచ్చు. అట్లాచేసినా ఈ కొండను ఛేదింపజాలడు. జిబ్రాల్టరు యుద్ధంలోనే తన అంతం చూస్తాడు.

# అమెరికా యుద్ధంలో చేర సిద్ధంగా ఉంది

## అధ్యక్షుడు రూజువెల్టుగారి ప్రకటన.

అమెరికా సంయుక్తరాష్ట్రముల ప్రభుత్వం, ప్రపంచంలో ప్రజా ప్రభుత్వ రాజ్యాలను ఉద్ధరించుటకై తిరిగి యుద్ధంలో చేరుటకు సర్వదా సిద్ధంగా ఉందని యీవారం రూజువెల్టు అధ్యక్షుడు ప్రకటించెను. అదివరకు పాతికేండ్ల క్రిందట యూరపు మహాయుద్ధంలో జర్మనీ గెలుస్తూవుంటే మిత్రమండలి దేశాలకు సహాయంగా అమెరికా యుద్ధంలో దిగి జర్మనీని ఓడించి ఇంగ్లాండు-ఫ్రాంసులకు విజయంచేకూర్చెను. దీనికంతకు అప్పటి అమెరికా అధ్యక్షుడగు వుడ్రోవిల్సనుగారే కారణం. ఆ మహనీయుడు జన్మించిన భవనం అమెరికా దేశీయులందరికి పవిత్రమయిన మందిరంగా అర్పణచేస్తు, యీవారం రూజువెల్టుగారు ప్రపంచ ప్రాముఖ్యతగల ఉపన్యాసం చేసేరు. ఈ ఉపన్యాసంతో వీరు ప్రజాప్రభుత్వ రాజ్యాలన్నిటికి బాసటగ నిలిచేరు. నాడు విల్సనుగారి సహాయంవలెనే నేటి రూజువెల్టుగారి సహాయం గూడ యుద్ధ పరిస్థితులను మార్చివేయగలదు.

విల్సనుగారు జన్మించిన మందిరం "స్వాతంత్ర్య దేవతకర్పనచేసే మందిరంగా దేశానికి యిచ్చివేస్తున్నాం" అని చెపుతూ రూజువెల్టుగారేమన్నారో వినండి:—స్వాతంత్ర్యము, ప్రజాప్రతినిధి ప్రభుత్వములు ప్రపంచంలో స్థిరంగా వెలసియుండాలని మేము విశ్వసించుచున్నామనుటకు యిదియొక నిదర్శనము. ఈ విశ్వాసముకొరకే మేము యిదివరకు యుద్ధంలో పాల్గొంటిమి. ఇందుకొరకే తిరిగి యుద్ధంలో దిగుటకు సర్వదాసిద్ధంగాయున్నాము. మానవ తత్వం గ్రహించుటచే మానవజాతికి నిజమైన వికాసం అభివృద్ధి కలిగిందని చరిత్ర ఘోషిస్తున్నది. "కత్తిమీదనే నమ్మకముంచువారు కత్తిచేతనే నాశనమవుతారు." ఇపుడు జరుగుచున్న యుద్ధంలో ప్రజాప్రతినిధి ప్రభుత్వాలకే తప్పక విజయం కలుగుతుందని గాఢనమ్మకం కలదని అధ్యక్షుడు రూజువెల్టుగారు చెప్పిరి.

# పోలిషు జాతీయ రాజ్యాంగం : 150 వ వార్షికోత్సవము.

## చర్చిలు ప్రధాని గంభీరోపన్యాసము.

నేడు జరుగుతున్న యుద్ధం, 1939 వ సం॥ సెప్టెంబరులో పోలండుపై హిట్లరు దండయాత్రతో ప్రారంభమైనది. పోలండు స్వాతంత్ర్యాన్ని కాపాడతానని ఇంగ్లాండు గయునకు అర్జునుడు యిచ్చినట్లు అభయమిచ్చింది. ఆ మాట యిప్పటికి నిలబెట్టుకుంటున్నది. జర్మనీ పోలండును ఆక్రమించినా పోలిషు జాతి అజేయమైనదని, యుద్ధము ముగిసిన పిదప, తిరిగి పోలండు స్వతంత్ర రాజ్యంకాగలదని, బ్రిటిషు ప్రధాని చర్చిలు, పోలిషు ప్రజల నుద్దేశించి గత శనివారం నాడొక గంభీరోపన్యాసము నొసంగెను. పోలిషు రాజ్యాంగ విధానము 1791 వ సంవత్సరమున యేర్పాటుచేయబడినది. దానియొక్క 150 వ సంవత్సరపు వార్షికోత్సవం శనివారం నాడు ప్రపంచమంతటిలో పోలిషు జాతివారున్న చోట్లన్నింటిలో జరుపబడెను. పోలండులో మాత్రం జరుగలేదు. ఎందుచేత అంటే, పోలండును ప్రస్తుతం హిట్లరు ఆక్రమించి, అచట స్వతంత్రఆలోచనలే లేకుండ, జాతీయోద్యమాలన్నింటిని అణచివేసేడుగనుక. పోలిషు ప్రభుత్వం లండనులో యిప్పటికి ఉన్నది. పోలిషు సైనికులు బ్రిటిషు సైనికులతో కలసి, పోలిషు నావికులు వైమానికులు బ్రిటిషు నావికులు వైమానికులతో కలసి, అన్ని యుద్ధరంగాలలోను జర్మను-ఇటలీ శత్రువులతో పోరాడుచునేయున్నారు. పోలిషు జాతీయోత్సవము నాడు, బ్రిటిషు ప్రధాని చర్చిలుగారు వారిని ప్రశంసించుచు, యీ దిగువ రీతిగా చెప్పెరు.

"పోలండు చక్కగ తమ యింటిని చక్కబెట్టుకొనుటను, పోలిషు అభ్యుదయమును, జర్మనులు చూడలేకపోయిరి. ప్రక్కన బలవత్తరమైన స్వతంత్ర పోలిషు ప్రభుత్వం తన దౌర్జన్య యత్నములను సాగనీయదని జర్మనీ పసిగట్టెను. 20 సంవత్సరములలో పోలండు ఎన్ని కష్టాలో దాటి ప్రశంసనీయమయిన అభివృద్ధిగాంచెను. ఇంతలో పెను భూతంలాగ జర్మనుదాడి దాపరించెను. అవసరం వచ్చినపుడు పోలండు వెనుకాడలేదు. తన జాతీయ గౌరవమునకు అవమానం కలిగించే సంధికి ఒప్పుకోక, జాతీయ శ్రేయం కొరకు, జాతీయైకమత్యం, వికాసం కొరకు తన పూర్వ సంపదను అభివృద్ధిని బలిదానం చేసింది. ఐరోపా ఖండమందలి అన్ని జాతులలో ఒక మహత్తర స్థానం పోలిషు జాతికి యీ బలిదానంవల్లనే చేకూరెను. పోలిషు సైనికులు, వైమానికులు, నావికులు యిపుడు బ్రిటిషు సైన్యాలతో కలసి జర్మను సేనలను తరిమివేయుచున్నారు. పోలిషు ప్రభుత్వము, పోలిషు సైన్యాలు ఇంగ్లాండులో యిపుడుండడం, వారితో పరిచయమెక్కువై, యుద్ధానంతరం పోలండు స్వాతంత్ర్యం పునః ప్రతిష్ట జరిగినపుడు ఉభయ జాతుల సామరస్యం పెంపొందుటకు మిగుల తోడ్పడును.

"ప్రషియనులు (జర్మనులు) కిరాతులవలె నున్నపుడు, క్రైస్తవ సాంప్రదాయమును ఎన్నో శతాబ్దములవరకు కాపాడిన అనేక యూరోపు జాతులు, యిపుడు హిట్లరు, ఆతని రాక్షస సైన్యపు దారుణ చర్యలకు గురియగుచున్నవి. ప్రతివారం ఆతని తుపాకులు డజను రాజ్యాలలో ప్రేలుతూ ఉంటాయి. సోమవారం డచ్చివారిని కాలుస్తాడు; మంగళవారం నార్వేవారిని, బుధవారం ఫ్రెంచివారిని లేక బెల్జియనులను ప్రేలుస్తాడు; గురువారం జక్కులవంతు, యిపుడు సెర్వ్యులు, గ్రీకులుగూడ ఆతని హింసకు గురియగుతున్నారు. పోలిషు ప్రజను హిట్లరు పెట్టు హింస యీ జాతులన్నింటి హింసను మించిపోవుచున్నది.

"అట్టి బాధలు పడుచు పోలండులో ఉన్న పోలిషు ప్రజలకు నా సందేశమేమనగా, పోలిషు జాతి నిరాశయన్నదేమో యెరుగక, అజేయమయి యున్నదని ధైర్యంగా ఉండండి. యంత్రబలంగల కిరాతులతో యీ పోరు సాగించుచున్నాము. బానిస హృదయులైన యీ కిరాతులు యితరులనుగూడ తమవలె బానిసలుగా చేయనెంచుచున్నారు. ఈ యుద్ధం చాల కాలం తీవ్రంగా జరుగగలదు. కాని చివర ఫలితం మనకు తెలియును. ప్రపంచ స్వాతంత్ర్యం కొరకు విశ్వాసంతో పాటుబడువారందరి కష్టం ఫలించును.

"ఈ ప్రషియను అధికారము, జాత్యహంకారము, దుస్తంత్రము, గూఢచారుల రహస్య వర్తనములు, యీ నాటకమంతా అంతమగు రోజు, మన మనుకున్ననాటికంటే ముందే రాగలదు. స్వాతంత్ర్యం విజయమొందినపుడు, ఈ ప్రజాప్రతినిధి ప్రభుత్వాలేగాక, నూతన ప్రపంచమునందలి ధైర్యముగల జాతులు, ఉత్తమ దేశాలన్నిగూడ, పోలిషు జాతి వికాసమును, అభ్యుదయమును చేమోడ్చి హర్షింపగలవు."

---

# ఇంగ్లాండు—ఇరాకు.

## రషీదాలిగారి మోసం—స్వాతంత్ర్య ప్రదాతయగు ఇంగ్లాండుపై తిరుగబడుట.

అరేబియాకు ఉత్తరంగాను, టర్కీకి దక్షిణంగాను ఉన్న యీ చిన్న ఇరాకుదేశం చమురు గనులకు ప్రసిద్ధిచెందినది. బాగ్దాదునగరం దీనికి ముఖ్యపట్నం. మూసలు అనుచోటనున్న చమురు గనులనుండి మధ్యధరాసముద్ర రేవు స్థలములగు ట్రిపోలి, హైఫాలవరకు చమురు గొట్టాలు నిర్మించబడియున్నవి. మూడేండ్లక్రిందటివరకు యీ దేశంలో 40 లక్షల టన్నుల చమురు ఉత్పత్తి అయేది. ఇరాకు సైన్యం 30,000. పోలీసులు వేరుగా ఉన్నారు. 2 వ ఫైజులు అను 6 సంవత్సరముల బాలుడు రాజుగ ఉన్నాడు. ఈతని తండ్రి ఘాజి 1939 వ సంవత్సరములో చనిపోయెను. మేనమామ ఎమిరు అబ్దులు ఇల్లా, ఫైజులు తరఫున రీజెంటుగ పరిపాలించుచుండెను. నెల రోజులక్రిందట జాతీయ పక్షనాయకుడగు సయదు రషీదు ఎల్ గైలానిగారు కొద్దిమంది సైనిక మిత్రులతోగూడ, రీజెంటు అధికారమును బలవంతంగా తీసుకొనెను. ఎమిరు ఇల్లాగారు ట్రాంసు జోర్డానియాకు పారిపోయిరి.

ఇరాకు స్వాతంత్ర్యం ముఖ్యంగా ఇంగ్లాండువల్లనే చేకూరెను. అట్టి ఇంగ్లాండుతో యిపుడు ఇరాకు యుద్ధంచేయుట మరీ చిత్రంగా ఉంది. 1931 వ సంవత్సరములో జరిగిన ఒడంబడిక ప్రకారం, బాస్రావద్దను, యూఫ్రటీసునదికి పడమరను విమానాశ్రయములు కట్టుకొనుటకు జాగాను ఇంగ్లాండుకి ఇరాకు యివ్వవలసియున్నది. ఈ విమానాశ్రయముల కొరకు ఇంగ్లాండు కొంత సైన్యములను, ఇరాకును ఆక్రమించే ఉద్దేశంతోకాక, ఇరాకు పరిపాలనకు

భంగం కలుగకుండ, ఆదేశంలో ఉంచవచ్చును. ఆ సైన్యాలు వచ్చి పోవుటకు, వాటికి సరకులు మందుగుండు సరఫరాకు, రవానా అవకాశాలు, రైలు రోడ్డుమార్గాలు, రేవులు విమానాశ్రయములను ఉపయోగించుటకు ఇంగ్లీషువారికి హక్కు గలదు. ఈ సైన్యాల రాకపోకలకు ఎట్టి షరతుల ప్రతిబంధకములు లేవు. ఇదీ ఇంగ్లాండు-ఇరాకుల ఒడంబడిక.

ఇపుడు బలవంతంగా రీజెంటు అధికారం వహించిన రషీదాలికూడ ఇంగ్లాండు ఇరాకు ఒడంబడికను గౌరవింతునని ప్రకటించి, బాస్రాలో బ్రిటిషు సేన దిగుటకు అనుమతించెను. కాని కొద్దిరోజులు పోయినాక, యింకో సైనిక దళం రానుండగ, ఉన్నదళం ఇరాకునుండి పోతేగాని క్రొత్త దళం వచ్చుటకు అనుమతించననెను. ఈతడు నాజీ ప్రభుత్వ ఉత్తరువు ప్రకారము యిట్లు చేసెననియు, ఇపుడు బ్రిటిషువారి నెదుర్కొనుటకు జర్మనీ సహాయం కోరెననిగూడ స్పష్టమయింది. తమ సైన్యాల రవానాగూర్చి ఆతని ఉత్తరువులను బ్రిటిను లక్ష్యపెట్టక పోగానే, ఆతడు, హబ్బనియా విమానదళ కేంద్రం చుట్టు తన సేనను కాపలాయుంచెను. అందుచే బ్రిటిషువారు దాన్ని భేదించవలసివచ్చెను. యుద్ధం ప్రారంభమయింది. ఇప్పటికే ఇరాకు విమానదళం సగం నిరుపయోగమొనర్చబడెను, బాస్రావద్ద సైనికనిలయములను బ్రిటిషు సేనలు ఆక్రమించినవి. బాగ్దాదు మున్నగు స్థలములపై రాయలు విమానాలు బాంబులు వేస్తున్నాయి. చమురు గనుల స్థితి ప్రమాదకరంగా ఉంది. అవి జర్మను వశంకాకుండా చూచుకోవాలి.

## ఇంగ్లాండు-తురుష్క రాజ్యాలు.

ఇరాకు విషయంలో ఇంగ్లాండుచర్య స్పష్టీకరింపబడినది. ఇంగ్లాండు ముస్లిము దేశాలపై దండెత్తుచున్నదని దుష్ప్రచారమును జర్మనులపుడే ప్రారంభించిరి. ఇరాకునకే ద్రోహంచేసిన కొందరు మోసగాండ్ర చర్యవలన ప్రాప్తించిన నేటి విపరీత పరిస్థితులకు ఇంగ్లాండు మిగుల వగచుచున్నది. ఇరాకులో శాంతి యుండాలని, సొంత రాజ్యాంగ విధానంప్రకారం స్వపరిపాలన కలిగియుండాలని ఇంగ్లాండు కోరుచున్నది. ఇరాకులో రాజ్యాక్రమణ ఆశ ఇంగ్లాండుకిలేదు. ముస్లిము రాజ్యంపై దాడిసలిపే ఉద్దేశం ఇంగ్లాండుకి ఎంతమాత్రంలేదు. కాని ఇరాకుతో కావించుకొన్న ఒడంబడిక షరతులు అమలు జరిగేటట్లుచేయడమున్ను తన మిత్రవర్గములోచేరిన ముస్లిము రాజ్యాలగు ఈజిప్టు టర్కీలకు మార్గనిరోధం లేకుండా కాపాడుకొనుటయున్ను ఇంగ్లాండు విధియైయున్నది.

కామన్సు సభలో విదేశాంగమంత్రి ఈడెనుగారు యిట్లు తెలిపిరి :—“ నేటి ఇరాకు దేశమునకు స్వాతంత్ర్యం ఒసంగి దానిని కాపాడే అభయమొసంగింది మేము. వారికి తోడ్పడి మాటప్రకారం సర్వదా నడుచుకొంటిమి ” అని చెప్పిరి. తగవు వచ్చినాక, ఈజిప్టు టర్కీల ప్రభుత్వములు రెండును మధ్యవర్తులుగానుండి తగవు పరిష్కారం చేయ సూచించినవి. ఇంగ్లాండు అందుకు వాటికి కృతజ్ఞత తెల్పుచు ఇంగ్లాండు తన సంధి హక్కును అమలు జరుప నిశ్చయించుకొన్నదనియు, వాటినిగూర్చి యితరులతో చర్చించుటకు పూర్వం ఇరాకు హబినాయయందున్న సేనను ఉపసంహరించుకొని, యుద్ధం మానవలెనని, స్పష్టంగా తెలిపెను. ఈ దుష్కార్యములకు బాధ్యులైనవారి చర్యలను ఈజిప్టు టర్కీలు హర్షించుటలేదు. తగవుకు కారణాలు పూర్తిగ తొలగించాలని ఈజిప్టు ప్రధాని సూచించెను. టర్కిషు పత్రికలు యిట్లా యెందుకు జరిగిందాయని విచారిస్తున్నాయి.

# గ్రీసునుండి సైన్యాలు మరలుట.

## సముద్రాలపై అధికారానికి ఏమి లోటుగాలేదు.

ప్రపంచంలో అందరి దృష్టి యిపుడు గ్రీసులో జరిగిన ఉదంతంపై మరలుట సహజం. శత్రుసైన్యాలు తమ సైన్యాలకన్న చాల హెచ్చుగ నుండుటచే, సామ్రాజ్యసేన గ్రీసునుండి మరలక తప్పినదికాదు. ఆ పని మే 2 వ తేదీతో పూర్తైంది. రెండు యుద్ధనౌకలు పోయినాయిగాని, 45,000 సైన్యం సురక్షితంగా గ్రీసునుండి తప్పించబడింది. బ్రిటిషుపక్షమున 3,000 మంది గాయపడుటో చనిపోవుటో జరిగెను.

గ్రీకుప్రభుత్వం జర్మనీ దాడిని ఎదిరించుటకు నిశ్చయించినపుడు దానికి సహాయం వెళ్లకపోతే బ్రిటను పిరికిపందయనిపించుకొని శాశ్వతంగా అపఖ్యాతి చెందుటయేగాక, యూరపులో అణగియున్న జాతులన్నింటి విశ్వాసమును పోగొట్టుగొనియుండును. వారంతా తమ విముక్తికై ఇంగ్లాండుపై ఆశపెట్టుకొని యున్నారు. ఈజిప్టు సూయజు కాల్వలను రక్షించుకొనవలసి యుండుటచే యింతకన్న ఎక్కువ సేనను పంపుటకు వీలులేకపోయింది. కొద్దిపాటి సామ్రాజ్య సేన పోతే పోయింది కాని, ఇంగ్లాండు యిపుడు గ్రీసుతో మాట నిలపెట్టుకుంది, యితరచోట్ల తన శక్తి యేమి తగ్గలేదు. ఈజిప్టుపై శత్రుదాడి అరికట్టబడింది. మధ్యధరా సముద్రం తూర్పు భాగమునందు సూయజు కాల్వపైని బ్రిటిషువారి అధికారం చెక్కుచెదరలేదు. శత్రువులకు ఏమి వొరగిందో చూద్దాం. ఒక్కగుండైనా పేల్చకుండా ఈజియను సముద్రంవరకు వద్దామని హిట్లరు ఉద్దేశించెను. కాని ఏమి జరిగింది. యుద్ధం చేయక తప్పిందికాదు. జర్మను సైన్యానికి చాలనష్టంకలిగెను. రాదారి మార్గాలు చెడ్డాయి. యుగోస్లావియాలో గొరిల్లా యుద్ధం జరుగుచున్నది. అచటను గ్రీసులోను ప్రజలు యింకెప్పటికి నాజీ అధికారానికి లొంగియుండరు. అంత ద్వేషం పెరిగింది. వందలకొలది విమానాలు కూల్చబడ్డాయి.

అబిసీనియా, తూర్పు ఆఫ్రికాలను ఇటలీ వదలుకొంది. బ్రిటిషువారి నౌకాదళాధికారం దిట్టంగా ఉండుటచే, ఉత్తర ఆఫ్రికా తీరమంతా జర్మనీ సైన్యాలు ఉంచవలసివస్తున్నది. ఈజియను సముద్ర తీరాన జర్మనీ విమానదళ కేంద్రాలున్నాయి. కాని ఈజిప్టుపైనో, టర్కీపైనో దాడిసలిపిగాని ముందెట్టి పని హిట్లరు చేయజాలడు. ఈ రెండు పనులు నిరోధింపబడతాయి.

గ్రీసులో ఇంగ్లాండు ఓడిపోయిన మాట నిజమేకాని, లిబియాలో తప్ప యితర చోట్ల ఎక్కడా ఇంగ్లాండు స్థితి మారలేదు, అధికార బలం ఏమి తగ్గలేదు. గ్రీసు సహాయానికి వెళ్లకపోతే ఎలాగుండునో అంతకన్న ఎక్కువ బలంగానే యిపుడున్నది ఇంగ్లాండు, గ్రీసు సైన్యాలు, క్రేటా దీవిలోని హార్బరులయందు విమానాశ్రయములందు గట్టిగ నిలచియున్నవి.

సలహా : ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరుచుకొనుడు.

[మదరాసు సమాచారముల డైరెక్టరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS : PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.